త్వరపడండి! **నీతిసుధానిధి** స్వంతం చేసుకోండి!!

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారు, 'శ్రీవాణి ఎడిటర్' శ్రీ కొమరగిరి రచించిన 'నీతిసుధానిధి' మూడు సంపుటాలు ది 19-8-2002 న హైదరాబాద్‌లో ఆవిష్కరించారు ఈ పుస్తకాలను E.H.V.L. Centre వారు ముద్రించినారు "విలువలు దిగజారిపోతున్న ఈ సమయంలో, ఈ మూడు నీతిసుధానిధి' పుస్తకాలు, కొంతవరకైనా విద్యార్థులలో దేశభక్తిని, జాతీయ బావాలను ఇనుమడింపజేసేందుకు దోహద పడుతాయని అభిప్రాయపడుతున్నాను" అని గౌ॥ శ్రీ నారా చంద్రబాబునాయుడు గారు ప్రశంసించారు

ఈ మూడు పుస్తకములు హైస్కూలు, కాలేజ్ విద్యార్ధులను దృష్టిలో పెట్టుకొని రచించబడినాయి నీతి తరగతుల (Moral Classes) లో బోధించ డానికి ఇవి బాగా ఉపయోగపడుతాయి "విద్యాసంస్థలు విధిగా నెలకు కనీసం రెండు పీరియడ్స్ నీతి తరగతులను నిర్వహించాలి" అని ఆదేశించింది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కనుక 'నీతిసుధానిధి'ని స్వంతం చేసుకొని, నైతిక విద్యావ్యాప్తికి తోడ్పడమని మనవి చేస్తున్నాము త్వరలో 6, 7 తరగతులకు కూడా పుస్తకాలు వెలువడుతాయి గమనించ ప్రార్ధన

**నీతిసుధానిధి, మూడు సంపుటాల వెల :** రూ 105-00 ఎమ్ ఒ ద్వారా పంపిన వారికి మూడు పుస్తకాలు కొరియర్ లేక Reg Post. ద్వారా పంపబడుతాయి ఆ ఖర్చులు మేమే భరిస్తాం

కనీసం పదిసెట్లు, ఆ పైన తీసుకొనేవారికి ప్రతి సెట్టు (మూడు పుస్తకాలు)కు రూ **20/- Discount** ఇవ్వబడుతుంది లారీ పార్శిల్ ద్వారా పుస్తకాలు పంపి ఎల్ ఆర్ పంపబడుతుంది లారీ చార్జీలు చెల్లించి పార్శిల్ తీసుకోవాలి గమనించ ప్రార్ధన

డి డి ద్వారా కూడా డబ్బు పంపవచ్చును డి డి అయితే **Komaragiri Krishna Mohan Rao, E.H.V.L. Centre, Machilipatnam** అని వ్రాసి **A/C Payee, D.D.** పంపవచ్చును

**ధన్యవాదములు**

**చిరునామా : 24-52, రామానాయుడుపేట, మచిలీపట్నం - 521001**
**ఫోన్ : 08672 - 22818 (O), 21137 (Press)**



# విద్యా సంస్థలలో నైతిక విద్య ఆవశ్యకత

"జాతిగౌరవంబు నీతిపై నిలుచును
నీతి లేకయున్న జాతి చెడును
నీతి గల్గు జాతి నిజమైన జాతిరా
వినుము భారతీయ వీర సుతుడా!"

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఒక జాతి యొక్క విలువ ఆ జాతి యొక్క భౌతిక సంపద మీదనే ఆధారపడి ఉండదు ఒక జాతి యొక్క గొప్పతనం ఆ దేశము యొక్క సైనిక శక్తి మీదనే ఆధారపడి ఉండదు ఒక దేశం యొక్క ప్రతిష్ఠ ఆ దేశము యొక్క విశాల భూభాగం మీదనే ఆధారపడి ఉండదు ఒక జాతి యొక్క గౌరవం ఆ జాతి యొక్క జనాభా మీదనే ఆధారపడి ఉండదు జాతి గౌరవం ఆ దేశ ప్రజల నైతిక ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది ఆ దేశమును పాలిస్తున్న పాలకుల నీతినిజాయితీల మీద కూడా ఆధారపడి ఉంటుంది వ్యక్తికి నీతి ముఖ్యం అదే విధంగా ప్రతి జాతికి నీతి అవసరం నీతిలేని వాడు చెల్లని నాణెంలాంటివాడు నీతి లేని జాతికి గౌరవం ఉండదు జీవితమునకు ఆదర్శం నీతి నీతిలేని మనిషికి సమాజంలో ఏమాత్రం విలువ ఉండదు అతనిని ఎవరూ నమ్మరు అదేవిధంగా నీతిలేని జాతిని ప్రపంచంలో ఎవరూ గుర్తించరు, గౌరవించరు, నమ్మరు నీతిలేనివాడు ఎంత గొప్ప మేధావి అయినా, ఎంత గొప్ప సైంటిస్టు అయినా, ఎంత గొప్ప రాజకీయ నాయకుడైనా ప్రయోజనంలేదు అటువంటి నీతిభ్రష్టుల వలన ఆ దేశమునకు ఏ మాత్రం మంచి చేకూరకపోగా, అప్రదిష్ట కూడా వచ్చి తీరుతుంది. కనుక ప్రతి ఒక్కరూ నీతి, నిజాయితీలను పెంపొందించుకొని జీవితమును సార్థకం చేసుకోవాలి, జాతి గౌరవమును ఇనుమడింపజేయాలి దేశ ప్రతిష్ఠను కాపాడాలి కనుక **నీతిగలవాడే నిజమైన మనిషి నీతిగల జాతియే నిజమైన జాతి**

## కోతియే మేలు :

'నీతిలేనివాడు కోతితో సమానం' అనే లోకోక్తి ఉన్నది అయితే ఈనాడు కోతులు కూడా ఈ సామెతను అంగీకరించడంలేదు "నీతిని వదిలినవాడు నా (కోతి) కంటే హీనుడవుతాడు" అని కోతి అంటున్నది కోతి కూడా కొంతవరకు ఆదర్శమును అందిస్తున్నది కోతికి మాటలు రావుగాని, తన మనోభావాలను చేతల ద్వారా నిరూపిస్తున్నది, విపులీకరిస్తున్నది కోతుల మనోభావాలను సునిశితంగా పరిశీలిస్తే ఒక వాస్తవం బయటపడు తుంది అదేమనగా "ఓ మానవా! నేను లేక నీవు లేవు ఆకారం ధరించిన నీ మనస్సే నేను ఓ మానవా! నీ మనస్సే కోతినైన నేను కాని నీ కంటే ఉత్తముణ్ణి. నేను రామసేవ చేశాను వారధి నిర్మాణంలోను, లంకాపురిని జయించడంలోను నా పాత్ర కూడా ఉన్నది నేను రామదాసుడను నీవా? కామదాసుడవు కాముడు రాక్షసుడు రాముడు భగవంతుడు కోతి, ఉడుత, పక్షి - మేమంతా రామసేవ చేసాం. కాని మానవుడు చేసిందేమిటి? సీతమ్మను కష్టాలపాలు చేసింది, రాముని అవస్థలపాలు చేసింది మానవుడేగదా! నాకైనా క్షణమైన స్థిరముంటుందేమో గాని, నీకు అదీ లేదు నాకు ఒక నీతి ఉంది. కానీ నీకు మాత్రం ఆ నీతి లేదు. కనుక మానవుని కంటే నేనే మేలు నీ కంటే నేను హీనం ఎట్లా అవుతాను?" అని కోతులు చేతల ద్వారా నిరూపిస్తున్నాయి కనుక నీతి ముఖ్యం నీతి లేకపోతే వ్యక్తి పతనమైపోతాడు, జాతి తన ప్రతిష్ఠను కోల్పోతుంది దేశ గౌరవ మర్యాదలు అంతరించిపోతాయి

## నీతి తరగతులు :

స్వాతంత్ర్యం వచ్చి 52 సంవత్సరాలు గడచినా, ఈ దేశంలో ఈనాటికీ 'విద్య' యాంత్రికంగానే బోధించబడుతున్నది మేధావులు, విద్యావేత్తలు ఆశించిన విధంగా మార్చురాలేదు విద్య నేర్వడం కేవలం ఉద్యోగం కోసమే అనే భావమును బాలబాలికల మనస్సుల నుండి వైదొలగించలేకపోయినాం. 'Education is for Life and not for Living' కేవలం జీవించడానికే విద్యకాదు, జీవితానికే విద్య కావాలి'

అనే అభిప్రాయాన్ని కలుగజేయలేకపోయినాం విద్య జీవనోపాధికి మాత్రమే కాదు, ఉత్తమ పౌరులుగా తయారుచేయడానికి 'విద్య' ఒక ఉత్తమ సాధన అనే విశ్వాసాన్ని పెంపొందించలేకపోయినాం ముఖ్యంగా విద్యా సంస్థలలో నీతితరగతులు (Moral Classes) నిర్వహించబడటంలేదు అసలు నీతి తరగతులు నిర్వహించడానికి అవసరమైన శిక్షణను అధ్యాపకులకు యిచ్చే ప్రయత్నం కూడా జరగటం లేదు ప్రభుత్వంగాని, విద్యా సంస్థలుగాని బాలబాలికల ఉత్తీర్ణత శాతాన్ని పెంచడానికి ప్రయత్నం చేస్తున్నారుగాని ఉత్తమ విలువలను పెంపొందించడానికి ఏ మాత్రం ప్రయత్నం జరగడం లేదు తత్ఫలితంగా బాలబాలికలలో నైతిక స్థాయి నానాటికి దిగజారి పోతున్నది క్రమశిక్షణారాహిత్యం పెచ్చు పెరిగిపోతున్నది ఏది మంచి? ఏది చెడు? అనే విషయాన్ని నిర్ధారించుకోలేకపోతున్నారు నేడు బాల బాలికలు ఇది వారి తప్పు కాదు ఇంటివద్ద తల్లిదండ్రులకు చెప్పడానికి తీరుబడి ఉండదు విద్యాలయాలలో అధ్యాపకులు బోధించరు బాలబాలికలకు నీతిని బోధించమని, నీతి కథలు చెప్పమని ప్రభుత్వం వైపు నుంచి వత్తిడిలేదు ఇది ఈనాటి దురవస్థ

"నేటి విద్య తెలివితేటలనే పెంచు
కొంచమైన గుణము పెంచబోదు
కోటి విద్యలుండి గుణము లేకున్నచో
అట్టి విద్యకన్న మట్టిమిన్న"

ఈనాటి తరం విద్యార్థులు పూర్వం వారికన్నా తెలివితేటలుగల వారే అనటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. మార్కులు, ర్యాంకులు సాధిస్తున్నారు కాని వారిలో ఉండవలసిన గుణం మాత్రం కనిపించడం లేదు "మార్కులు చూస్తే ర్యాంకులు వస్తున్నాయి, గుణం చూస్తే బ్లాంకులు, జీరోలు" అని చమత్కరించారు శ్రీ సత్యసాయిబాబావారు ఇది పైకి చమత్కారంగా అనిపించినా, దీనిలో ఎంతో వాస్తవం ఉన్నది 'విద్య' అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు 'విద్య' యొక్క లక్ష్యం డిగ్రీలు సంపాదించడం మాత్రమే కాదు మార్కులు, ర్యాంకులు

తెచ్చుకోవటమే కాదు గోల్డుమెడల్స్ సాధించడమే కాదు ఇవన్నీ కావల్సిం కాని మార్కులతో పాటు రిమార్కులు కూడా రాకుండా చూచుకోవాలి విద్యతోపాటు వినయమును కూడా అలవరచుకోవాలి చదువుతోపాటు సంస్కారమును కూడా పెంపొందించుకోవాలి వినయంలేని విద్యార్థి రాణించడు, శోభించడు సంస్కారంలేని చదువు నిష్ప్రయోజనం వివేకం లేని విజ్ఞానం వినాశనానికి దోహదం చేస్తుంది మానవత్వాన్ని కోల్పోయిన విజ్ఞానం మారణహోమానికి దారితీస్తుంది ఆలోచనారహితమైన మేధాశక్తి సర్వనాశనానికి దారితీస్తుంది అయితే ఈనాటి విద్యలు తెలివితేటలను మాత్రమే పెంచుతున్నాయిగాని ఏ మాత్రం గుణమును పెంచడంలేదు వినయ వివేకాదులను అభివృద్ధిపరచడంలేదు సంస్కారవంతులను గావించడంలేదు గుణంలేని జీవితం దీపంలేని గుడివంటిది గుణం కంటే మించిన బలం వేరొకటి లేదు గుణం ప్రధానం, ధనం ప్రధానం కాదు అయితే ఈనాడు ధనమునకు దాసోహమంటున్నారు ధర్మానికి దూరమవుతున్నారు. ధనం శాశ్వతంకాదు. అది ఎప్పుడు వస్తుందో, ఎవరి వద్దకు వస్తుందో, ఎంత కాలం ఉంటుందో ఎవరూ చెప్పలేరు నీతి ధర్మాలు మాత్రం శాశ్వతం "Money comes and goes, but Morality comes and grows" ధనం వస్తుంది, పోతుంది నీతి వస్తుంది, పెరుగుతుంది నీతి గనుక ప్రవేశిస్తే ఉన్న స్థితి నుంచి ఉన్నత స్థితికి తీసుకొని పోతుంది కనుక నీతికి మించిన ధనం వేరొకటి లేదు గుణం అంతకంటే ఎక్కువ ముఖ్యం. కనుక ప్రతి విద్యార్థి సద్గుణసంపన్నుడు కావాలి

## సచ్ఛీలం (GOOD CHARACTER)

'గుణం' అంటే శీలం (Character), 'సద్గుణం' అంటే సచ్ఛీలం (Good Character) సచ్ఛీలమనగా 'మంచి గుణం, మంచి నడత, మంచి సంస్కారం' అని చెప్పుకుంటే సరిపోతుంది ఎన్ని చదువులు చదివినప్పటికినీ, సచ్ఛీలంలేని వ్యక్తి ఎందుకూ పనికిరాడు. సచ్ఛీలము లేనివాడు పశువుతో సమానం శీలమే జీవునికి అలంకారం సామాన్యులు బాహ్య సౌందర్యము లకు విలువ యిస్తుంటారు భగవంతుడు మాత్రం సచ్ఛీలతకు ప్రాధాన్యత

యిస్తాడు  భగవంతుని దృష్టిలో సచ్ఛీలమే ధనము, సదాచారమే సంపద మానవుని విలువ బాహ్య సౌందర్యము నందులేదు  ఆస్థిపాస్థుల యందు అంతకన్నా లేదు. సచ్ఛీలమునందు మాత్రమే ఉన్నది  సచ్ఛీలములేని వ్యక్తి ఏ రంగంలోనూ రాణించడు, శోభించడు  సకల అష్టైశ్వర్యములు సంపాదించినప్పటికినీ, సమస్త అధికారములను పొందినప్పటికినీ, అతి ముఖ్యమైన సచ్ఛీలమే గనుక లేకపోతే వాటన్నింటినీ తృటిలో కోల్పోతాడు. ఇదే వాస్తవము  ఈ నీతి సూక్తి తేటతెల్లం చేస్తున్నది.

***If Wealth is Lost, Nothing is Lost***
***If Health is Lost, Something is Lost***
***If Character is Lost, Everything is Lost***

## ప్రహ్లాదుడు :

దానవరాజైన ప్రహ్లాదుడు అకళంక దైవభక్తుడు  నిష్కామ బుద్ధితో అనేక పుణ్యకర్మలనాచరించి, దానధర్మాలుచేసి, యజ్ఞయాగాదుల నాచరించి, అత్యున్నతమైన ఇంద్రపదవిని సంపాదించాడు  అసలు ఇంద్రుడు పదవిని కోల్పోయాడు  పదవిని కోల్పోయిన అసలు ఇంద్రుడు విచారంతో దేవతల గురువైన 'బృహస్పతి' వద్దకు వెళ్ళి తన గోడును చెప్పుకొని, తరుణోపాయాన్ని చూపించమని అర్థిస్తాడు. తిరిగి ఇంద్ర సింహాసనమును పొందటానికి ఉపాయం చెప్పమని వేడుకుంటాడు  అప్పుడు బృహస్పతి ఒక చక్కటి సలహాను యిస్తాడు. ప్రహ్లాదుడు దానాలు యిచ్చే సమయంలో, భిక్షక రూపంలో, అతని కొలువు వద్దకు వెళ్ళి, అతని శీలమును దానం అడుగమని చెబుతాడు. బృహస్పతి సలహా ప్రకారం పదవిని కోల్పోయిన అసలు ఇంద్రుడు, భిక్షక రూపం ధరించి, దానం యిచ్చే సమయంలో ఇంద్రపదవిలో నున్న ప్రహ్లాదుని దగ్గరకు వెళ్ళి, శీలాన్ని దానం యివ్వమని అర్థిస్తాడు. అప్పుడు ఇంద్ర పదవిలోఉన్న ప్రహ్లాదుడు ఆశ్చర్యపోయి, 'వట్టి శీలంవల్ల ప్రయోజనం ఏమిటి? దానితోనే సంతృప్తి చెందుతావా? ఇంకేమైన అడుగు. ఏది అడుగుతే దానిని యిస్తాను  గోసంపద

కావాలా? మాణ్యాలు కావాలా? ధనం కావాలా? ఏదైన అడుగు, యిస్తాను' అని అంటాడు యాచక రూపంలోవున్న అసలు ఇంద్రుడు "నాకేమీ అవసరంలేదు నీ శీలం ఒక్కటే చాలు" అంటాడు ఇంద్రపదవిలో నున్న ప్రహ్లాదుడు నిస్సంకోచంగా "ఇస్తున్నాను, తీసుకో!" అని అనగానే ఒక తేజస్సు ప్రహ్లాదుని దేహం నుండి బయటకు వచ్చి భిక్షక రూపంలో వున్న అసలు ఇంద్రునిలో ప్రవేశిస్తుండగా "నీవెవ్వరవు?" అని ఇంద్ర పదవిలో నున్న ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు అప్పుడు ఆ తేజస్సు "నేను నీ శీలమును, నన్ను నీవు ఆ భిక్షకునికి దానం చేశావుగదా! కనుక నిన్ను వదలి అతనిలో ప్రవేశిస్తున్నాను" అని ఆ తేజస్సు బదులుచెప్పి ఆ యాచకునిలో ప్రవేశిస్తుంది మరల కొంతసేపటికి మరొక తేజస్సు ప్రహ్లాదుని శరీరము నుండి బయటకు రాగా "నీవెవ్వరవు?" అని ప్రహ్లాదుడు ప్రశ్నించగా, అప్పుడు ఆ తేజస్సు "నేను నీ శౌర్యమును, శీలం యొక్క సేవకుడ్ని, నీలో శీలం వున్నంతకాలం నిన్ను సేవించాను ఇప్పుడు శీలం నీ నుండి వెళ్ళిపోయింది గదా! కనుకనే నేను కూడా శీలం వెంబడిపోతున్నాను"అని జవాబు చెప్పి, ఆ యాచకునిలో ప్రవేశిస్తుంది చివరకు స్త్రీ ఆకారంలో ఒక తేజస్సు ఇంద్రపదవిలోనున్న ప్రహ్లాదుని శరీరము నుండి బయటకు వస్తుంది 'నీవెవ్వరవు?' అని ప్రహ్లాదుడు ప్రశ్నిస్తాడు అప్పుడు ఆ స్త్రీ ఆకారంలోవున్న ఆ తేజస్సు 'నేను నీ యొక్క రాజ్యలక్ష్మిని నేను కూడా శీలం సేవకురాలినే శీలాన్ని వెంబడించి, నేను కూడా పోతున్నాను'అని చెప్పి ఆ భిక్షక రూపంలో వున్న అసలు ఇంద్రునిలో ప్రవేశిస్తుంది దీని వలన మనం ఒక నీతిని నేర్చుకోవాలి. ఇంద్రపదవిలోనున్న ప్రహ్లాదుడు తన శీలమును దానం యివ్వడం వలన, తన శౌర్యాన్ని, తన రాజ్యలక్ష్మిని కూడా కోల్పోయాడు తన అధికారాన్ని, సమస్త వైభవాలను కూడా కోల్పోయినాడు భిక్షక రూపంలో వున్న అసలు ఇంద్రుడు తిరిగి ఇంద్ర సింహాసనాన్ని పొందాడు కనుక మనలో శీలమే గనుక లేకపోతే, మనం ప్రతి దానిని కోల్పోతాం ఇది వ్యక్తి విషయంలో ఎంత వాస్తవమో, జాతి విషయంలో కూడా అంతే అందు వలననే మన ప్రాచీనులు శీలమునకు అత్యంత ప్రముఖ స్థానం యిచ్చారు.

ధనం పోతే ప్రమాదం లేదు తిరిగి సంపాదించుకోవచ్చును ఆరోగ్యం గనుక చెడిపోతే, కొంత పోగొట్టుకొన్నవాళ్ళమవుతాం శీలమే గనుక పోతే, శీలరహితులమైతే సమస్త అధికారములను, సంపదలను కోల్పోతాము ఈ సత్యమును విస్మరించకండి

## వ్యక్తిగత శీలం - జాతీయ శీలం :

శీలం రెండు రకములు 1 వ్యక్తిగత శీలం (Personal Character) 2 జాతీయ శీలం (National Character) ప్రతి వ్యక్తిలో ఈ రెండు శీలాలు సరిసమానంగా వున్నప్పుడే వ్యష్టి, సమిష్టుల ప్రగతి సాధ్యమవుతుంది దీనిలో ఏ ఒక్కటి లోపించినా వ్యక్తి ప్రయత్నం నిష్ప్రయోజనమవుతుంది ఈ రెండూ ఒకే నాణెమునకు బొమ్మ, బొరుసులాంటివి ఒక నాణెమునకు ఒక ప్రక్క జాతీయ చిహ్నం, రెండవ ప్రక్క నాణెం విలువ వుంటుంది ఈ రెండింటిలో ఏది అరిగిపోయినా, ఆ నాణెం చెల్లదు అదేవిధంగా ఈ రెండు శీలాలు ప్రతి వ్యక్తికి తప్పనిసరిగా ఉండాలి ఏ ఒక్క శీలం లోపించినా అతను సమాజంలో చెలామణి కాలేడు కనుక ఈ రెండు శీలాలు ప్రతి వ్యక్తిలో ఉండాలి

## వ్యక్తిగత శీలము (PERSONAL CHARACTER)

మన భారతీయ సంస్కృతిలో 'వ్యక్తిగతశీలము'నకు అత్యున్నతమైన, గౌరవప్రదమైన ప్రముఖ స్థానం యివ్వబడింది. వ్యక్తిగత శీలం గల వ్యక్తులనే తత్త్వవేత్తలుగా మన సమాజం గుర్తించింది. Spotless Character గలవారినే గౌరవించింది మచ్చలేని మనుషులకే మన సమాజంలో విశిష్ఠమైన స్థానం యివ్వబడింది త్రాగుబోతులను, కాంతా కాంచనములకు దాసులైనవారిని, సంస్కారవిహీనులను, వినయ విధేయతలు లేనివారిని, స్వార్థపరులను మన ప్రాచీన సమాజము ఎప్పుడూ తత్త్వవేత్తలుగా పరిగణించలేరు దురాచారాలను ప్రోత్సహించే వారిని ఆచార్యులుగా భావించి గౌరవించలేదు, పూజించలేదు అయితే

దురదృష్టవశాత్తు రానురాను సదాచారములకు, ఉన్నత భావములకు తిలోదకాలివ్వడం జరుగుతున్నది. వ్యక్తిగత శీలమునకు యివ్వవలసినంత ప్రాధాన్యత నేటి సమాజంలో యివ్వటంలేదు వ్యక్తిగత జీవితమును గురించి ఎవ్వరూ పట్టించుకోవటంలేదు సామాజిక, రాజకీయ రంగములలో పనిచేసే కార్యకర్తల వ్యక్తిగత శీలమును గురించి అసలే ఆలోచించటం లేదు. అధికారంలో వున్న వ్యక్తి యొక్క శీలం ఎంత హీనంగా ఉన్నప్పటికీ జోక్యం చేసుకొని మందలించటం జరగటంలేదు ప్రజలకు కావల్సింది వారి పనులు కావటమే. నాయకుల వ్యక్తిగత శీలం ఎట్లా వున్నా ఎవ్వరూ పట్టించుకోరు ఇంకా విచిత్రమేమిటంటే. ఆధ్యాత్మిక తత్త్వవేత్తల ప్రసంగాలు, ప్రవచనాలకు మాత్రమే ప్రాధాన్యత యిస్తున్నారుగాని, వారి వ్యక్తిగత శీలాన్ని గురించి ఎవ్వరూ పట్టించుకోవటంలేదు వారు చెప్పే మాటలను మాత్రమే విని సంతోషిస్తున్నారు గాని, వారి ఆచరణను గమనించటం లేదు, పట్టించుకోవటంలేదు అందువలననే నేడు మన సమాజం అనేక యిక్కట్లను ఎదుర్కొనవలసి వస్తున్నది, అనర్థాలు దాపురిస్తున్నాయి ఉన్నత పదవులలో నున్నవారు కాంతాదాసులై అవినీతి పరులవుతున్నారు ప్రభుత్వ ఖజానాను కొల్లగొడుతున్నారు బంధుపక్ష పాతంతో అక్రమ మార్గాలననుసరిస్తున్నారు ఈనాడు మన దేశంలో అవినీతి వికటాట్టహాసం చేస్తున్నది ఎక్కడ చూచినా స్కాములు, కుంభ కోణాలు విశృంఖలంగా విలయతాండవం చేస్తున్నాయి మన దేశ ఆర్థిక వ్యవస్థ నానాటికి దిగజారిపోతున్నది ఆర్థిక పురోభివృద్ధి కుంటుపడు తున్నది. అధికారంలో వున్నవారు స్త్రీలోలురైతే, మత్తుపానీయాలకు బానిసలైతే మరీ ప్రమాదం. వారి బలహీనతలను పసికట్టి, అక్రమమార్గాల ననుసరించి ఎవరి పనులు వారు తేలికగా చేయించుకొని పోతుంటారు ఇట్టి వారి వలన దేశానికి మరింత ప్రమాదం. కనుక పాలకుల సమర్థతే ముఖ్యం కాదు వ్యక్తిగత శీలం అంతకన్నా ముఖ్యం. పాలకుల రాజకీయ చతురతే ముఖ్యం కాదు. వ్యక్తిగత శీలం కూడా ఉండాలి. సచ్ఛీలరహితుల వలన ప్రయోజనం శూన్యం. ప్రమాదాలు కూడా వచ్చి మీదపడుతుంటాయి

ముఖ్యంగా పాలకులు సచ్ఛీల సంపన్నులు కావాలి మచ్చలేని శీలము (Spotless Character) ను కలిగి ఉండాలి ఎవరి చేత్తో వేలెత్తి చూపడానికి వీలులేనటువంటి సత్ప్రవర్తనను పెంపొందించుకోవాలి

## శ్రీరాముని ఆదర్శశీలం:

శ్రీరాముడు సచ్ఛీల సంపన్నుడు శ్రీరాముని సచ్ఛీలము యెడల శత్రువులకు కూడా అత్యున్నతమైన విశ్వాసం, గౌరవం ఉండేది యుద్ధ భూమిలో రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు లక్ష్మణుని చేతిలో మరణిస్తాడు భార్య సులోచన సహగమనము చేయ సంకల్పించుకుంటుంది భర్త మృతశరీరము యుద్ధభూమిలో ఉంటుంది గదా! నిస్సహాయ స్థితిలో సులోచన విలపిస్తుంటుంది రావణుడు చూచి, కొడలిని పిలిచి, శ్రీరాముని శిబిరానికి వెళ్ళి, భర్త మృతశరీరాన్ని అడిగి తెచ్చుకోమంటాడు ఒక స్త్రీని శత్రు శిబిరానికి ఒంటరిగా పంపటం మంచిదికాదంటారు మంత్రులు సులోచన కూడా వెళ్ళడానికి సంకోచిస్తుంది అప్పుడు రావణుడు "బాలబ్రహ్మచారి అయిన హనుమంతుడు, జితేంద్రియుడు అయిన లక్ష్మణుడు, ఏకపత్నీ వ్రతుడైన శ్రీరాముడు వున్నచోటుకి, నీవు నిర్భయంగా వెళ్ళవచ్చును, అమ్మా!" అని ఎంతో విశ్వాసంతో చెబుతాడు అప్పుడు మంత్రులు "మీరు రాముని భార్యను తెచ్చారు గదా! అలాంటి రాముని దగ్గరకు మీ కోడలిని ఒంటరిగా పంపటం సమంజసమా?" అని సందేహాన్ని వెలిబుచ్చుతారు అప్పుడు రావణుడు, 'పరస్త్రీని అపహరించడం రావణుని పని, రాముని పనికాదు' అని అంటాడు శత్రువులకు కూడా శ్రీరాముని యెడల ఎంతటి సద్భావం, విశ్వాసం ఉండేదో ఈ సంఘటన తేటతెల్లం చేస్తున్నది

## శీలంలేని శక్తి నిష్ప్రయోజనం:

రావణాసురుడు భౌతిక శక్తులన్నింటిని తన అరచేతిలో అష్ట దిగ్బంధన చేసుకోగలిగాడు సమస్త అధికారాలు సంపాదించాడు సకల భోగభాగ్యములను సమకూర్చుకున్నాడు అతనిని ఎదిరించగల శక్తి

ముల్లోకములలో ఎక్కడా కనిపించలేదు అతని మహత్తర శక్తి ముందు అనంతమగు ప్రకృతియే మోకరిల్లింది అతని తేజము ముందు దేవేంద్రాది దిక్పాలకులే నిస్తేజులైపోయినారు అతని పేరు స్మరించి నంత మాత్రము ననే సకల చరాచరకోటి కూడా హడలిపోయేది అయినప్పటికీ అతనికి పతనం తప్పలేదు అంతేకాదు అతనితోపాటు అతని వంశమే (విభీషణుడు తప్ప) సర్వనాశనం అయిపోయింది కారణం? అతను సర్వశక్తులూ సంపాదించాడుగాని, 'శీలం' అనే శక్తిని మాత్రం సంపాదించలేకపోయాడు వీరాధివీరుడైన హనుమంతుడంతటివాడు రావణుని శక్తిని చూచి నివ్వెర బోయి 'పరస్త్రీ వ్యామోహం అతనిలో లేకుండినచో, అతనిని ఓడించగల శక్తివంతుడు ముల్లోకములలో కానరాడు' అని రావణుని శక్తిసామర్థ్యము లను కళ్ళారా చూచి ఆశ్చర్యచకితుడై చెబుతాడు హనుమంతుడు శీలం లేని శక్తి నిష్ప్రయోజనమని రావణుని విషయంలో ఋజువైంది. శీలంలేని వ్యక్తి అప్రదిష్టపాలవుతాడు శీలరహితుడు సమాజంపాలిటి చీడపురుగు

## శివాజీ ఆదర్శం :

శివాజీ పరాయిస్త్రీలను తన తల్లితో సమానంగా భావించి, గౌరవించేవాడు యుద్ధంలో పట్టుబడిన ముస్లీం స్త్రీలను అవమాన పరచ కుండా, సురక్షితంగా వాళ్ళ బంధువుల వద్దకు పంపించినట్లుగా చరిత్రలో అనేక ఉదంతాలున్నాయి. శివాజీ కుమారుడు శంభాజీ శివాజీకన్నా అతడు అతిబలపరాక్రమ సంపన్నుడు యుద్ధనీతి దురంధరుడు అయినప్పటికీ శివాజీకి వచ్చిన మంచి పేరుప్రతిష్ఠలు శంభాజీకి రాలేదు కారణం? వ్యక్తి శీలం లేకపోవటంవలన శంభాజీ రాణించలేదు. కాలగర్భంలో కలిసిపోయాడు. చరిత్రహీనుడయ్యాడు సచ్ఛీలరహితుల వలన దేశానికి, జాతికీ అప్రదిష్ట వస్తుంది తీరని హాని చేకూరుతుంది కనుకనే మన ప్రాచీనులు శీలరహితులను గుర్తించలేదు అట్టి వారికి చరిత్రలో కూడా స్థానం లేకుండా చేశారు కనుక నేటి సమాజం కూడా శీలరహితులను బహిష్కరించగలిగినప్పుడే, ఆ దేశం బాగుపడుతుంది. ప్రపంచంలో ఆదర్శ వంతమైన దేశంగా మంచి పేరు ప్రతిష్ఠలను సంపాదించుకుంటుంది

కనుక నిజంగా జాతికి సేవ చేయాలనుకుంటే ఎట్టి బలహీనతలకు ఏమాత్రం లొంగిపోకుండా స్వచ్ఛమైన వ్యక్తిగత శీలాన్ని పెంపొందించుకోండి!

## జాతీయ శీలము (NATIONAL CHARACTER) :

'జాతీయ శీలము' అనగా 'దేశభక్తి' అని కూడా చెప్పవచ్చును ప్రతి వ్యక్తిలో మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దైవభక్తి ఉండాలి అదే విధంగా 'మాతృదేశభక్తి' కూడా ఉండాలి నవమాసాలు మోసి, కనిపెంచిన 'మాతృదేవి' యెడల మనం ఎటువంటి శ్రద్ధాభక్తులను ప్రదర్శిస్తామో, అంతకన్నా మిక్కిలిగా మన మాతృభూమి యెడల చూపించడం ప్రతి పౌరుని కర్తవ్యం ఇది మన మాతృభూమి ఈ పుణ్యభూమి మనకు ప్రాణ ప్రదమైనది ఈ తపోభూమి మనకు అత్యంత పవిత్రమైనది ఈ వేదభూమి లోని ప్రతి అణువూ మనకు పూజనీయమైనదే ఈ వీరభూమి యెడల మన హృదయాంతరాళములలో సతతమూ వీరోచితమైన భక్తిభావం ప్రజ్వరిల్లుతూ ఉండాలి. ఈ పవిత్ర భూమి గౌరవప్రతిపత్తులను ఇనుమడింప జేసేందుకు శక్తివంచన లేకుండా కృషి చేయటం మన కర్తవ్యంగా భావించాలి

ఈ దేశ సంస్కృతీ సంప్రదాయాలను గౌరవించడం మన ధర్మంగా భావించాలి ఈ దేశధర్మపరంపరలను ప్రపంచానికి చాటాలి మన దేశ స్వాతంత్ర్యమును పరిరక్షించుకుంటూ, సమగ్రతను, సమైక్యతను కాపాడు కుంటూ, ప్రపంచంలో మన దేశం ఒక అగ్రరాజ్యంగా రూపొందటానికి ప్రతి పౌరుడూ కృషి చేయాలి రవి అస్తమించిన బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కూకటి వేళ్ళతో పెకలించి, స్వాతంత్ర్యభిక్ష పెట్టిన త్యాగధనులను ఆదర్శంగా గైకొని, ఆ అమరవీరుల స్ఫూర్తితో, కార్యోన్ముఖులై నవభారత నిర్మాణానికి ప్రతి ఒక్కరూ నడుం బిగించాలి.

## శ్రీరాముని మాతృదేశభక్తి :

రావణుడు శ్రీరాముని చేతిలో మరణిస్తాడు. యుద్ధం ముగుస్తుంది లంకాపురి శ్రీరామునికి వశమవుతుంది. సువర్ణమయమైన లంకా పురిని

చూచి లక్ష్మణుడు మోహపడుతాడు  లంకాపురిని వదలి అయోధ్యకు వెళ్ళడానికి మనస్కరించక, "అన్నయ్యా! సువర్ణమయమైన ఈ లంకా పురిని వదలి, పేదదేశమైన అయోధ్య వెళ్ళటం దేనికి? ఇక్కడనే వుండి, సకల సంపదలను హాయిగా అనుభవిస్తూ కాలం గడుపుదాం" అని అంటాడు లక్ష్మణుడు  అప్పుడు శ్రీరాముడు ఎంతో బాధతో, కోపంతో ఈ విధంగా ప్రత్యుత్తరమిస్తాడు

"అపిస్వర్ణమయీలంకా, నమో లక్ష్మణ రోచతే
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

"ఓ లక్ష్మణా! లంక బంగారుమయమైనను, నాకు ఇష్టము లేదు. తల్లియు, జన్మించిన దేశము స్వర్గముకంటే శ్రేష్టమైనవి" అని అంటాడు శ్రీరాముడు  శ్రీరామునికి మాతృపితృభక్తులతోపాటు, మాతృ దేశభక్తి ఎంత ప్రగాఢంగా ఉండేదో ఈ ఉదంతం స్పష్టం చేస్తున్నది  ఒకవేళ దురదృష్టవశాత్తు తల్లి కురూపి కావచ్చు, గ్రుడ్డిది కావచ్చు, కుంటిది కావచ్చు  అయినప్పటికీ నవమాసాలు మోసి కనిపెంచిన తల్లి తల్లే ఆమె మాతృమూర్తే, ఆమె పూజనీయురాలే  అదే విధంగా జన్మించిన దేశం పేదది కావచ్చు, బీదది కావచ్చు  అయినప్పటికీ జన్మించిన దేశం జన్మ యిచ్చిన తల్లిలాంటిదే  అట్టి మాతృదేశ ప్రగతి కోసం ప్రతి ఒక్కరూ పాటు పడాలి  ఇదే భావాన్ని ప్రపంచానికి చాటాడు శ్రీరాముడు

## వివేకానంద ఆదర్శం :

వివేకానంద అమెరికా, బ్రిటన్‌లాంటి సంపన్న దేశాలు పర్యటించి భారతదేశానికి తిరిగి ప్రయాణమవుతున్న సమయంలో వివేకానందుని పత్రికా విలేఖరులు **'ఇప్పుడు మీ మాతృభూమి పట్ల మీ అభిప్రాయమేమిటి?'** **అని** ప్రశ్నిస్తారు. **అప్పుడు వివేకానంద "భారత దేశాన్ని లోగడ** ప్రేమించాను. **కాని ఇప్పుడు భరతభూమిలోని** ప్రతి **ధూళికణం నాకు అత్యంత** పవిత్రము. **అది నాకొక తీర్థస్థానము"** అని సగర్వంగా సమాధానం చెబుతాడు  భారత

దేశంలోని ప్రతి పౌరుడి లక్ష్యం, ఆదర్శం అదేవిధంగా ఉండాలి పూర్వజన్మ సుకృతం వలన ఈ పవిత్ర భూమిలో మనం జన్మించాం ఇక్కడి ప్రతి అణువు మనకు అత్యంత పవిత్రమైనది కనిపెంచిన తల్లి మీద ఏ విధమైన మాతృభావన మనకుంటుందో, మనకు జన్మనిచ్చిన ఈ భరతమాత (భారతదేశం) మీద కూడా అదే విధమైన మాతృభావన (మాతృదేశభక్తి) ఉండాలి

కనుక ప్రతి ఒక్కరిలో వ్యక్తిగత శీలంతోపాటు జాతీయ శీలం కూడా ఉండాలి కేవలం వ్యక్తి మంచితనం మాత్రమే జాతిని ఉద్ధరించ లేదు మంచితనంతోపాటు దేశభక్తిని కూడా కలిగిఉండాలి మంచితనాన్ని సంరక్షించుకోవడానికి అవసరమైన శక్తిని, సామర్ధ్యాన్ని సముపార్జించు కోవాలి అప్పుడే మనం మన మాతృభూమిని రక్షించుకోగలుగుతాం

## మహాత్మాగాంధీజీ ఆశయం :

"నైతిక, ఆధ్యాత్మిక, శీలసంపత్తులను ఇనుమడింపజేసేదే సరియైన విద్య" అన్నారు మహాత్మాగాంధీజీ నీతి మానవుని ఉన్న స్థితి నుండి ఉన్నత స్థాయికి కొనిపోయే రాజమార్గం విచక్షణ ప్రతిబింబమే నీతి మానవుని పవిత్ర నడతలతో కూడిన దివ్యమైన మాధుర్యసారమే నీతి నీతిగల మానవునియందే వ్యక్తిత్వం వికసిస్తుంది క్రమబద్ధమైన ఉత్తమ జీవితాన్ని గడిపేవారికి మాత్రమే వ్యక్తిత్వ వ్యక్తీకరణ అధికారం ఉంటుంది. నీతిగల వాడే ధైర్యంగా, స్పష్టంగా చెప్పగలుగుతాడు, శాసించగలుగుతాడు కనుక ప్రతి వ్యక్తిలో నైతిక విలువలను పెంపొందించేదే నిజమైన విద్య

కేవలం నైతిక విలువలు మాత్రమే చాలవు నైతికమునకు ఆధ్యాత్మికం కూడా చేర్చాలి ఉదాహరణ మైకు మంచి కండీషన్‌లో ఉండినప్పటికినీ, కరెంటు లేకపోతే అది పలుకదు కరెంటు ఉండినప్పటికీ, మైకు కండీషన్‌లో లేకపోతే ప్రయోజనంలేదు Positive మరియు Negative లు రెండూ చేర్చినప్పుడే మైకు పలుకుతుంది. అవియే నైతిక ఆధ్యాత్మికములు నీతినిజాయితీ రెండూ రెండు నేత్రాల వంటివి. కనుక

ప్రతి ఒక్కరూ ఈ రెండింటినీ పెంపొందించుకొని జీవితమును సార్ధకం చేసుకోవాలి

## ఆధ్యాత్మికం అంటే? :

'ఆధ్యాత్మికం' అనగానే, ఇదేదో మతఛాందసమని చాలామంది ఈనాడు భావిస్తున్నారు ఆధ్యాత్మికమంటే అర్ధంకాని సనాతనమైన, బూజు పట్టిన ఛాందస సిద్ధాంతమని మరికొందరు భావిస్తున్నారు భజనలు చేయటం, ధ్యానం చేయటం, యజ్ఞయాగాది క్రతువుల నాచరించటం, పుణ్యక్షేత్రాలను సందర్శించటం మాత్రమేనని ఇంకా కొందరు భావిస్తున్నారు ఇది కాదు "మానవునియందున్న పశుత్వాన్ని జయించడమే **ఆధ్యాత్మికము మానవత్వము నుండి దివ్యత్వానికి చేరుకోవటమే ఆధ్యాత్మికము.** మనలో **జీర్ణించుకొనిపోయిన పశుత్వగుణాలైన అసూయ, ఈర్ష్య, ద్వేషము, దురాశ, అహంకారం మొదలగు దుర్గుణాలను దూరంగా నెట్టివేసి, మానవతా విలువలైన సత్యం, ధర్మం, అహింస, దయ, ప్రేమ, కరుణ, సహనం, సానుభూతి మొదలగు సద్గుణాలను స్వంతం చేసుకోవటమే ఆధ్యాత్మికము"** అటువంటి మానవతా విలువలను పెంచుకొనినప్పుడు నరుడు నారాయణుడు అవుతాడు; జీవుడు శివుడు అవుతాడు, మానవుడు మాధవుడు అవుతాడు, పశువు పశుపతిగా మారుతుంది కనుక మానవతావిలువలను పెంపొందించేదే **'నిజమైన విద్య'** అందువలననే గాంధీజీ "నైతిక, ఆధ్యాత్మిక, శీల సంపత్తులను ఇనుమడింప జేసేదే సరియైన విద్య" అన్నారు "The end of Education is Character" (విద్యాఫలం శీలం)అన్నారు శ్రీ సత్యసాయి బాబావారు

## డా॥ సర్వేపల్లి :

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత బాలబాలికలకు మంచి విద్యను అందించాలనే పరమావధితో కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అనేక కమీషనులు, కమిటీలు నియమించారు. అయితే వారు చేసిన సూచనలు మాత్రం అమలుకావటంలేదు **డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ** అధ్యక్షులుగా 1949 సం॥లో

'యూనివర్సిటీ ఎడ్యుకేషన్ కమీషన్' నియమించబడింది అధ్యయనం చేసి ఆ కమీషన్ ఇచ్చిన రిపోర్టులో "We are building a civilisation, not a factory or a workshop. The quality of civilisation depends not on the material equipment or the political machinary but on the character of men The major task of Education is the improvement of Character" (మనం ఒక నాగరికతను నిర్మించుకుంటున్నాం అది కర్మాగారము కాదు, వర్క్‌షాప్ కాదు నాగరికత యొక్క నాణ్యత భౌతిక వస్తు సంభారంవల్ల కానీ, రాజకీయ యంత్రాంగం వల్ల గానీ ఏర్పడదు మానవుల శీల సంపద మీద ఆధారపడి ఉంటుంది విద్య యొక్క ప్రధాన కర్తవ్యం ఉత్తమశీలాన్ని పెంపొందించటం) ఐదు దశాబ్దాలు గడిచినా ఈ ఆదర్శం అమలు జరప బడలేదు విద్యావిధానం నానాటికి దిగజారిపోతున్నది విద్యాలయాలు, విద్యార్థులను పరీక్షలకు తయారుచేసే యంత్రాగారాల్లా మారాయి విద్యార్థులకు మంచిగా మార్కులు వస్తున్నాయిగాని, క్రమశిక్షణా రాహిత్యం మాత్రం పెచ్చు పెరిగిపోతున్నది సద్గుణాలు తరిగిపోతున్నాయి, దుర్గుణాలు పెరిగిపోతున్నాయి ఇవి విద్యార్థుల తప్పు మాత్రమేకాదు. శీల నిర్మాణానికి తోడుపడే నీతి విద్య (Moral Education) కరువైపోయింది నేడు పాఠశాలలో నీతి తరగతులు నిర్వహించబడటంలేదు ఇంటి వద్ద నీతికథలు తల్లులు చెప్పే స్థితిలో లేరు తరగతి గదులలో అధ్యాపకులు శ్రద్ధ వహించడంలేదు ప్రభుత్వం కూడా ఈ నైతిక విద్యావ్యాప్తికి తగిన చర్యలు తీసు కోవటంలేదు ఒకవేళ తీసుకున్నా అవి కాగితాల వరకే పరిమితమై పోతున్నాయి ఇది ఈనాటి స్థితి, పరిస్థితి, దుస్థితి

## విద్య యొక్క ప్రయోజనం:

విద్య యొక్క అసలైన ప్రయోజనం విజ్ఞానాన్ని సముపార్జించడం, వినయాన్ని పెంచడం, వివేకాన్ని కలుగజేయడం, అనుభవజ్ఞానాన్ని అభివృద్ధి చేయడం, ప్రపంచ జ్ఞానాన్ని పెంపొందించడం, బాలబాలికలను

సంస్కారవంతులుగా తయారుచేయడం, నైతిక విలువల ఆవశ్యకతను, ప్రాముఖ్యతను బోదిస్తూ, బాలబాలికలను సచ్ఛీల సంపన్నులుగా తీర్చిదిద్దటం ఈ ప్రయత్నం ఎప్పుడు? ఎక్కడ జరగాలి? ఎవరు బాధ్యత వహించాలి? ఈ విషయమును గురించి ప్రభుత్వం, విద్యాసంస్థల అధినేతలు, విద్యావేత్తలు, మేధావులు, అధ్యాపకులు, తల్లిదండ్రులు ఆలోచించాలి ఆలోచించి, చర్చించి ఒక నిర్ణయాన్ని గైకొని అమలు చేయవలసిన సమయం ఆసన్నమైంది 'ఆలస్యం అమృతం విషం' ఈ విషయంలో ఆలస్యం చేస్తే, అశ్రద్ధ చేస్తే భారతదేశ భవిష్యత్తు అంధకార బంధురమవుతుంది ఈ వాస్తవాన్ని విస్మరించకండి

## శైశవేఽభ్యస్త విద్యానాం:

అసలు 'విద్య' అనేది ఎప్పుడు నేర్వాలి అందులో 'నైతిక విద్య' ఎప్పుడు వంటపడుతుంది? 'విద్య' అనేది ఎప్పుడుపడితే అప్పుడు అబ్బేది కాదు వెలయిస్తే బజారులో లభించే వస్తువు అంతకన్నా కాదు దానికి ఒక సమయం, సందర్భం అంటూ ఉన్నాయి 'శైశవేఽభ్యస్త విద్యానాం' విద్య అనేది బాల్యమునందే అభ్యసించాలి అప్పుడే బాగా వంటపడు తుంది అప్పుడు నేర్చుకున్నది, అలవరచుకున్నది జీవితాంతం బాగా గుర్తు ఉంటుంది మధ్యలో నేర్చుకున్నది మధ్యలోనే పోతుంది కనుక అటు వంటి బాల్యదశను సద్వినియోగం అయ్యేట్లుగా చూడాలి ముఖ్యంగా ఈ బాధ్యత ఎవరిది? ఎవరు చేయగలరు? ఇంటి వద్ద తల్లిదండ్రులు, విద్యాలయాలలో గురువులు చేయగలుగుతారు. దీనికితోడు ప్రభుత్వ ప్రోత్సాహం ఉండాలి విద్యాసంస్థల అధినేతలలో ఉత్సాహం ఉండాలి అప్పుడే 'నైతిక విద్య' వ్యాప్తి జరుగుతుంది బాలబాలికలు **'విద్యా వినయ శోభితులు'** గా వెలుగొందుతారు 'సచ్ఛీల సంపన్నులు'గా తయారవుతారు భారతదేశ భవిష్యత్తు కడు ఉజ్జ్వలంగా ఉంటుంది మనం ఆశించిన విధంగా నవభారత నిర్మాణం జరుగుతుంది

# సర్వమత సమన్వయం

ఈనాడు కులపిచ్చితో క్రుమ్ములాడుకుంటున్నారు మతం పేరిట మారణహోమాలు జరుగుతున్నాయి ప్రతి మతం మంచినే బోధిస్తున్నది అయితే మన మతులు వక్రించడం వలన వివిధ మతాల మధ్య వైషమ్యాలు పెచ్చుపెరిగిపోతున్నాయి ఇది నిజంగా దురదృష్టకరం ఇది మానవత్వ లక్షణం కాదు ఇది పశుత్వ లక్షణం

"Religion is the idea which is raising the brute unto Man, Man unto God" ''మృగాన్ని మానవునిగా, మానవుని దేవునిగా మార్చగల శక్తి మతంలో ఉన్నది'' అన్నారు వివేకానంద కనుక ఏ మతమూ చెడ్డదికాదు మన అవగాహనలోపం వలన సంఘర్షణలకు అవకాశం ఏర్పడుతున్నది కనుక వివిధ మతాల మధ్య సమన్వయం ఉండాలి, సంఘీభావం ఉండాలి, సమైక్యత ఉండాలి అప్పుడు శాంతి భద్రతలకు అవకాశం ఏర్పడుతుంది

''దేవాలయములు, మసీదులు, చర్చీలు ఉండటం పాపమని అది మూఢ సంప్రదాయమని భావించేవారితో నేనేమాత్రం ఏకీభవించను అందరకీ చెందిన ఆరాధానా కేంద్రాలుండటం మానవాళికి అత్యంతా వశ్యకం మతం లేనిదే మానవుడు మనజాలడు సత్యసాక్షాత్కారమే అన్ని మతముల గమ్యం ప్రతి మతంవారు తమ మతం తాలూకు మూల సూత్రాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలి తమ మతభావాలను ఎలా గౌరవించు కుంటారో, అన్యుల మతభావాలను కూడా అలాగే గౌరవించడం నేర్చు కోవాలి మన దేశంలో ఎన్ని మతాలకు చెందినవారున్నప్పటికీ, మనమంతా ఒకే జాతికి చెందినవారమనే భావం మాత్రం విస్మరించరాదు'' అని చెప్పారు మహాత్మాగాంధీజీ అలాంటి విశాల భావం, సహనశక్తి ఉన్నప్పుడు వివిధ మతముల మధ్య సంఘర్షణలకు తావే ఉండదు

"మతములన్నియు మంచినే బోధించె
తెలిసి మెలగవలయు తెలివితోడ
మతులు మంచివైన మతమేమి చెడ్డది"

అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు సరియైన అవగాహన లేక, ఇతర మతములను విమర్శిస్తూ మన మతులను చెడగొట్టుకుంటున్నాము గాని మతములలో తప్పులేదు మనసులు కలుషితం కావటంవలననే మనుష్యులు చెడిపోతున్నారు మతము కాదు మతి మారాలి మనిషి కాదు మనసు మారాలి అప్పుడు వివిధ మతాల మధ్య మారణహోమాలు జరగటానికే అవకాశముండదు

ప్రపంచంలో చాలా మతాలున్నాయి అయితే వాటి మార్గం ఒక్కటే, లక్ష్యం ఒక్కటే, గమ్యం ఒక్కటే అయితే వారు అనుసరించే విధానాలలో కొంచెం తేడా ఉండవచ్చును అంతమాత్రమున వివిధ మతాలవారు సంఘర్షణలకు దిగవలసిన అవసరం ఏమాత్రం లేదు

వివిధ మతాల వారి బోధనలను సునిశితంగా పరిశీలిస్తే అన్ని మతాల బోధల అంతరార్థాలు ఒక్కటే అనే సత్యం బహిర్గతమవుతుంది

జీసస్ 'I am the Messenger of God' (దైవదూత) అన్నారు పర్షియన్లు, ముస్లీములు I am the Light (Life) అన్నారు బౌద్ధులు 'బుద్ధం శరణం గచ్ఛామి' అన్నారు హిందూ ధర్మం, 'వైదిక ధర్మం' దీనికి సమానంగా 'ద్వైతము'ను బోధించింది

ఇంకా ఒక మెట్టు పైకిపోయి జీసస్ I am the son of God (దైవకుమారుడు) అన్నారు దీనికి సమానంగా పర్షియన్లు, ముస్లీములు The Light is in me (The life is in me) అన్నారు. దీనికి సమానంగా బౌద్ధులు 'సంఘం శరణం గచ్ఛామి' అన్నారు. హిందూ ధర్మం దీనికి సమానంగా "విశిష్టాద్వైతము"ను ప్రతిపాదించింది.

ఇంకా ఒక మెట్టు పైకిపోయి జీసస్, "I and my father are one" (దైవమే తాను, తానే దైవము) అన్నారు. దీనికి సమానంగా "I am

the Light (I am the Life) అన్నారు పర్షియన్లు, ముస్లీములు  దీనికి సమానంగా బౌద్ధులు "ధర్మం శరణం గచ్ఛామి" అన్నారు  దీనికి సమానంగా 'అద్వైతము' ను బోధించింది వైదిక ధర్మం

మతాలు భిన్నమైనప్పటికీ బోధించిన భావాలు మాత్రం ఒక్కటే మాటలు, పదాలు వేరు కావచ్చును  అర్థాలు, అంతరార్థాలు మాత్రం అన్ని మతాలవి ఒక్కటే  ఈ సత్యమును తెలుసుకోలేక సామాన్యులు వైషమ్యాలను పెంచుకుంటున్నారు  పోరాటాలు కొనసాగిస్తున్నారు  సంఘర్షణలకు దిగుతున్నారు  ఇది మారాలి  వివిధ మతాల మధ్య సమన్వయాన్ని సాధించడానికి అందరూ కృషి చేయాలి

సర్వమతాలకు మూలం ప్రేమ  "ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం  కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేకపోయినా, అది శ్వాస తీసుకుంటునే ఉంటుంది" అని కబీర్ మహాశయుడు ఏనాడో చెప్పాడు ప్రేమ, కరుణలు మానవునికి వుండవలసిన ప్రధానమైన సద్గుణములు వీటిని ప్రతి మతం బోధిస్తున్నది  ఈ వాస్తవమును తెలుసుకోలేక, అవివేకంతో సంఘర్షణలకు దిగుతున్నారు  ఈ సత్యమును నేటి బాలబాలికలకు మనం బోధించాలి

# ఆదర్శ అధ్యాపకులు

భారతీయ సంస్కృతియందు గురువునకు అత్యున్నతమైన స్థానం ఉన్నది.  అనాదిగా మన దేశంలో గురువును దైవసమానంగా భావించి, గౌరవించి, పూజించటం మన సంప్రదాయం  భక్తిశ్రద్ధలతో గురువుని సేవించినవారికి దైవానుగ్రహం కూడా లభిస్తుందని మన విశ్వాసం

## గురువు:

'అజ్ఞానము' అను అంధకారమును పారద్రోలి 'జ్ఞానము' అను వెలుగును ప్రసాదించువాడు 'గురువు'. 'అజ్ఞానము' అనే అంధకారమును

దూరంచేసి 'ప్రజ్ఞానము' అనే ప్రకాశవంతమైన జ్యోతిని వెలిగించువాడు 'గురువు' కంటి పొరను తొలగించి దృష్టిని ఇచ్చేవాడు డాక్టర్ అయితే, అజ్ఞానమనే పొరను వైదొలగించి 'జ్ఞానదృష్టి'ని ప్రసాదించేవాడు 'గురువు' ఇది మన ప్రాచీనుల విశ్వాసం, ఆనాటి గురువుల ఆదర్శం

## ఆచార్యుడు :

ప్రాచీన విశ్వవిద్యాలయాలలో విద్యను బోధించేవారిని **'ఆచార్యులు'** అనేవారు ఈనాటి విశ్వవిద్యాలయాలలో విద్యను బోధించే వారిని Professors అంటున్నాము ఈ ఇంగ్లీషు పదము యొక్క అర్థము కూడా ఆచార్యులే తాము ఆచరించి, విద్యార్థులకు బోధించేవాడు **'ఆచార్యుడు'**

అయితే ఈనాడు 'అజ్ఞానము'ను పారద్రోలి 'జ్ఞానము'ను ప్రసాదించే టటువంటి గురువులు కనిపించటంలేదు తాము ఆచరించి, విద్యను బోధించేటటువంటి ఆచార్యులు కూడా కరువైపోతున్నారు కాలం మారింది, వ్యవస్థ మారింది, విద్యావిధానం మారింది పరీక్షా విధానం కూడా మారింది సామాజిక పరిస్థితులు మారాయి విద్య నేర్పేవారి ఆలోచనాసరళి కూడా మారింది విద్యార్జన చేసేవారి మనస్తత్వం కూడా మారింది

## ఉపాధ్యాయులు, అధ్యాపకులు :

లౌకిక విద్యలు ప్రాముఖ్యత పెరిగింది ఆధ్యాత్మిక విద్య ఆవశ్యకత తరిగింది. నైతిక విద్యను గురించి ఎవరూ పట్టించుకోవటం లేదు లౌకిక విద్యలు శ్రద్ధగా నేర్పేటటువంటి ఉపాధ్యాయులు, అధ్యాపకులు సంఖ్య కూడా నానాటికీ తరిగిపోతున్నది అయితే ఇంకా కొంతమంది ఆదర్శ అధ్యాపకులు ఉన్నారు కాని శ్రద్ధతో విద్యను నేర్చుకునే విద్యార్థులు సంఖ్య కూడా నానాటికి తరిగిపోతున్నది అధ్యాపకుల మీద గౌరవం లేకుండా పోతున్నది ఈనాటి గురువుల (అధ్యాపకుల) మీద విద్యార్థులకు 'గురి' లేకుండా పోతున్నది 'గురి' లేనివారికి ఏ విధంగా విద్య అబ్బుతుంది? **"గుణములేని సుతుడు, గురిలేని విద్యలు, నీతిలేని జాతి నిష్ఫలంబు"** అన్నారు

శ్రీ సత్యసాయిబాబావారు ఈ విచిత్ర పరిస్థితికి విద్యార్థులు ఒక్కరే కారకులు కాదు తల్లిదండ్రులు, అధ్యాపకులు కూడా బాధ్యులు నీతి విద్య (Moral Education) నేర్పకపోవటం వలన, విద్యార్థుల 'నైతిక ప్రవర్తన' నానాటికీ దిగజారిపోతున్నది నైతిక విద్యకు యివ్వవలసిన ప్రాధాన్యత, ప్రోత్సాహం ప్రభుత్వంకూడా యివ్వటంలేదు అందువలన విద్యాలయాల నైతిక స్థాయి నానాటికి పడిపోతున్నది ఇది ఈనాటి విచిత్ర పరిస్థితి

## ఆదర్శ అధ్యాపకులు :

అధ్యాపకులు ఆదర్శజ్యోతులుగా వెలుగొందాలి ఆ జ్యోతులు నిరంతరము వెలుగుతునే ఉండాలి అప్పుడే విద్యార్థుల జ్యోతులు కూడా క్రాంతితో వెలుగుతుంటాయి అధ్యాపక వృత్తి, అన్ని ఉద్యోగాలకన్నా అతి ముఖ్యమైనది, పవిత్రమైనది ప్రపంచానుభవంలేని పిల్లలు ఒక్కొక్క అధ్యాపకుని చేతిలో వేలాదిమంది ఉంటారు వారి లేత మనస్సులపై ఉపాధ్యాయుల ఉపదేశ ప్రభావాలు ఎక్కువగా ఉంటాయి. కనుక ఉపాధ్యాయులు తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే, వేలాది మంది విద్యార్థులు చెడిపోయే ప్రమాదం ఉన్నది భవిష్యత్తుకు రాచబాట వేయు వారు విద్యార్థులైతే, వారికి మార్గదర్శకులు అధ్యాపకులు కావాలి అందు వలననే **“ఒక విద్యార్థి చెడిపోతే దానివలన అతనే నష్టపోతాడు, ఇంకా కొద్ది మంది విద్యార్థులు కూడా చెడిపోవచ్చును కాని ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో తన కర్తవ్యాన్ని గనుక నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు”** అని అంటారు శ్రీ సత్యసాయిబాబావారు ఈ మాటల వెనుక నున్న అంతరార్థమును అర్థం చేసుకుంటే సమాజంలో అధ్యాపకుల పాత్ర ఎంత ఉన్నతమైనదో, ఉత్కృష్టమైనదో, పవిత్రమైనదో బోధపడుతుంది కనుక అధ్యాపకులు పవిత్ర హృదయంతో విద్యార్థులకు చక్కటి మార్గదర్శకం చేసినప్పుడు వారి భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుంది అధ్యాపక వృత్తికి వన్నె తెచ్చినవారవుతారు

## శిల్పి :

అధ్యాపకుడు శిల్పితో సమానం బండరాయిని తెచ్చి, చెక్కి దివ్య మంగళమైన దేవతా విగ్రహాలను రూపొందించగలడు 'శిల్పి' విద్యార్థులు కొండలలోవున్న గుండువంటివారు, బండరాయి వంటివారు వీరికి అధ్యాపకులనే శిల్పులు, చక్కటి రూపకల్పన చేయాలి వారిని సచ్ఛీల సంపన్నులుగా తీర్చిదిద్దాలి సంస్కారవంతులను చేయాలి శిల్పి చెక్కిన విగ్రహంలో ఏ దోషం ఉన్నా, అది రాయిది కాదు, విగ్రహానిది అంతకన్నా కాదు ఆ దోషం శిల్పిదే అదే విధంగా విద్యార్థుల భవిష్యత్తు తల్లిదండ్రులు, అధ్యాపకుల మీద ఆధారపడి ఉంటుంది కనుక అధ్యాపకులు ఉత్తమ సంస్కారవంతులు కావాలి. అప్పుడే విద్యార్థులను వినయశీల సంపన్నులుగా తీర్చిదిద్దగలుగుతారు.

## తోటమాలి :

**తోటమాలి** అడవి నుంచి రకరకాలైన మొక్కలను తీసుకొని వచ్చి పార్కులో నాటి, నీరు పోసి పెంచుతాడు ఎప్పుడు ఎరువు వేయాలో, ఎప్పుడు మందు వేయాలో ఆలోచించి, సరియైన సమయంలో వేసి మొక్కలను పెంచుతాడు అందంగా కనపడటానికి అప్పుడప్పుడు 'కట్' చేస్తుంటాడు అడవిలో మొక్కలు చిందరవందరగా పెరుగుతాయి వాటికి ఒక క్రమ పద్ధతి ఉండదు అడవిలోని మొక్కలలాంటివారు విద్యార్థులు అధ్యాపకుడు తోటమాలివంటివాడు అడవిలో చిందరవందరంగానున్న మొక్కలను తీసుకొనివచ్చి పార్కులో నాటి, ఒక చక్కటి రూపకల్పన చేసి అందంగా పార్కును ఏ విధంగా తోటమాలి తీర్చిదిద్దుతాడో, అదేవిధంగా అమాయకులైన పసిహృదయాలను తీసుకొని ప్రేమతో లాలించి, బుజ్జగించి, విద్యాబుద్ధులు నేర్పి చక్కటి సంస్కారవంతులుగా విద్యార్థులను తీర్చిదిద్ద వలసిన బాధ్యత అధ్యాపకులదే

## దీపం - జ్యోతి :

ఒక దీపంతో ఎన్నో దీపాలను వెలిగించవచ్చు ఒక జ్యోతితో ఎన్నో జ్యోతులను వెలిగించవచ్చును అయితే ఆ దీపం, ఆ జ్యోతి నిరంతరం వెలుగుతూ వుండాలి అదే విధంగా అధ్యాపకులనే జ్యోతులు నిరంతరమూ వెలుగుతుండాలి ఒక విధంగా ఆలోచిస్తే, అధ్యాపకులే నిజమైన విద్యార్థులు ఎందువలనంటే, అధ్యాపకులు నిరంతరం, నిరవధికంగా సర్వవేళలా జ్ఞానసముపార్జన చేస్తూఉండాలి అప్పుడే 'జ్ఞానము' అనే వెలుగును బాలబాలికలకు అందించగలుగుతారు కనుక అధ్యాపకుడు నిరంతరం అధ్యయనం చేస్తూ, క్రొత్త విషయాలను తెలుసుకుంటూ, తెలుసుకొనిన విషయాలను విద్యార్థులకు అందిస్తూ ఉండాలి ఇది ఒక నిరంతర సాధన కనుక అట్టి సాధన చేయవలసినవారు 'అధ్యాపకులే'

## అలారం :

మనం తెల్లవారుఝామున లేవడానికి గడియారానికి 'అలారం' పెడుతాం సరీగా మనం పెట్టిన సమయానికి అది మ్రోగుతుంది. నిద్రలో నున్న మనల్ని లేపుతుంది లేవడానికి సమయం అయిందని హెచ్చరిస్తుంది అదేవిధంగా అజ్ఞానాంధకారంలో పయనిస్తున్న శిష్యులను హెచ్చరించి, లేపి, కర్తవ్యమును బోధచేసి సన్మార్గంలో నడిపించాలి అధ్యాపకులు కనుక అలారంలాంటివాడు 'అధ్యాపకుడు' జడపదార్థమైన గడియారమే 'అలారం' పాత్రను సక్రమంగా నిర్వర్తిస్తుంటే, చైతన్యవంతులైన అధ్యాపకుల పాత్ర ఇంకా ఎంత ఉన్నతంగా ఉండాలో! ఎంతటి బాధ్యతతో కూడినటు వంటిదో! విజ్ఞులైన అధ్యాపకులు గ్రహించి, గుర్తించి, తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలి

## TANK - TAP :

అధ్యాపకుడు Water Tank వంటివాడు విద్యార్థులు Taps వంటివారు Tank లో ఎటువంటి నీరు ఉంటే, అటువంటి నీరే Taps

ద్వారా లభిస్తుంది Tank లో మంచినీరు వుంటే Taps ద్వారా మంచినీరు వస్తుంది ఒకవేళ Tank లో దుర్గంధభూయిష్టమైన మురికినీరువుంటే, అదే నీరు Taps ద్వారా మనకు వస్తుంది అసలు Tank లో నీరువుంటే, Taps లో నీరువస్తుంది ఒకవేళ Tank లో నీరే లేకపోతే, Taps లో చుక్క నీరు కూడా రాదు ఇది వాస్తవం అధ్యాపకుడు యిచ్చేవాడు (బోధించేవాడు), విద్యార్థి పుచ్చుకొనేవాడు (నేర్చుకునేవాడు) అయితే ఈనాడు చాలామంది అధ్యాపకులలో యివ్వవడానికి సరుకులేదు (బొధించేశక్తిలేదు) పుచ్చు కోవడానికి చాలామంది విద్యార్థులు కూడా సంసిద్ధులై లేరు (నేర్చుకోవ డానికి సిద్ధంగాలేరు) కొంతమంది అధ్యాపకులలో బోధించేశక్తి, సమర్థత, సామర్థ్యము వున్నదిగాని, వారి ప్రవర్తన ఉండవలసిన రీతిలో, స్థాయిలో వుండటం లేదు సచ్ఛీలత (Good Character) లేని వ్యక్తి ఏమి చెప్పినా, ఎంత బాగా చెప్పినా దానికి విలువలేదు బోధించడంకాదు, ఆచరించాలి చెప్పటంకాదు చేసి చూపించాలి కనుక అధ్యాపకులు నిరంతరము మంచి విషయాలను అధ్యయనంచేస్తూ, అధ్యయన ఫలితాలను ఆచరణలో పెడుతూ, మచ్చలేని ఆదర్శజీవితాన్ని గడుపుతూ, విద్యార్థులకు చక్కటి ఆదర్శబోధన చేస్తుండాలి అప్పుడే విద్యార్థులు కూడా సత్ప్రవర్తన అలవరచు కుంటారు

## GUIDE POST :

విద్యార్థులను తగినరీతిలో తర్ఫీదు చేయవలసిన బాధ్యత అధ్యాపకులది అధ్యాపకుడు Guide Post వంటివాడు Guide Post Board స్థిరంగా ఉండినప్పుడే, ప్రయాణీకులు దానిని ఆధారంగా తీసుకొని చేరవలసిన గమ్యమునకు సులభంగా, సక్రమంగా, సవ్యంగా, సకాలంలో చేరుకోగలుగుతారు ఆ Guide Post Board స్థిరంగా ఉండకుండా, గాలికి అటూ, ఇటూ ఊగిసలాడుతుంటే, ప్రయాణీకులకు తాము చేరవలసిన గమ్యం, వెళ్ళవలసిన రోడ్డు తెలియక నానా అవస్థలకు గురిఅవుతుంటారు అదేవిధంగా స్థిరంగా వున్న Guide Post వలె అధ్యాపకుల భావాలు కూడా

స్థిరంగా ఉండాలి ఊగిసలాడే మనస్తత్వం ఉండరాదు స్థిరమైన, నిశ్చలమైన, సత్సంకల్పాలు కలిగిఉండాలి సద్బోధనలు మాత్రమే విద్యార్థులకు చేస్తూ ఉండాలి. అప్పుడే విద్యార్థులు ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దబడతారు

## ప్రేమపుత్రులు - కామపుత్రులు:

'విద్యార్థులు, అధ్యాపకులు ప్రేమపుత్రులు అసలు బిడ్డలు కామపుత్రులు ప్రేమపుత్రులను, కామపుత్రులకంటే సన్నిహితం చేసు కోవాలి' అన్నారు శ్రీ సత్యసాయిబాబావారు అలనాడు కామపుత్రుడైన అశ్వద్థామ కంటే, ప్రేమపుత్రుడైన అర్జునునకు సకల శస్త్రాస్త్ర విద్యలను బోధించాడు 'ద్రోణుడు' కనుకనే ద్రోణుని '**ఆచార్యుడు**' అని పిలిచారు ఆచరించి బోధించేవాడు '**ఆచార్యుడు**' అని చెప్పారు అయితే ఈనాడు చాలామంది అధ్యాపకుల ప్రవర్తన దీనికి విరుద్ధంగా ఉన్నది. ఈనాడు చాలామంది అధ్యాపకులు క్లాస్‌రూంలకు వెళ్ళుతారు, ఒక లెక్చర్ యిస్తారు వారు వింటున్నారా? లేదా? వారికి అర్థం అయిందా? లేదా? అనే విషయాన్ని మాత్రం పట్టించుకోరు (అందరూ అంతేకాదు ఆదర్శ అధ్యాపకులు కూడా ఉన్నారు అయితే వారి సంఖ్య నానాటికి తరిగిపోతున్నది) అదే టీచర్ ఇంటికి వెళ్ళుతాడు తన బిడ్డలు సరీగ చదవకపోతే బాధపడుతాడు అదిరించి, బెదిరించి, బుజ్జగించి వారిని సన్మార్గంలో పెట్టడానికి ఎంతో శ్రమిస్తాడు కామపుత్రులు శ్రేయస్సు కోసం ఎంత శ్రద్ధ తీసుకుంటారో ప్రేమపుత్రుల భవిష్యత్తును తీర్చిదిద్దడానికి కూడా అంత శ్రద్ధ తీసుకోవాలి ఆ విధంగా శ్రమించే అధ్యాపకులే, ఆదర్శ అధ్యాపకులు. ఈనాడు అటువంటి ఆదర్శ అధ్యాపకుల అవసరం ఎంతైనా ఉన్నది అప్పుడే అధ్యాపకుని పాత్ర సార్థకమవుతుంది అట్టి వారి జీవితం ధన్యమవుతుంది

## తిలక్ ఆదర్శం:

బాలగంగాధర తిలక్ స్వాతంత్ర్య పోరాటంలో ఎనలేని కృషి సలిపాడు 'స్వాతంత్ర్యం నా జన్మ హక్కు' అని సింహగర్జన చేసిన

మహనీయుడు ఆ నినాదం భారతయువతను లేపింది వారిలో ఉత్సాహం పెల్లుబికింది స్వాతంత్ర్య పోరాటంలోనికి దూకారు అయితే ఆనాడు 'తిలక్' పూనాలో ఉపాధ్యాయుడుగా పనిచేస్తుండేవారు ఆయనను ఒకసారి పత్రికా విలేఖరులు "అయ్యా! తమరు స్వాతంత్ర్యం కోసం ఎంతో కృషి చేస్తున్నారు గదా! స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మంత్రిపదవి చేబడుతారా? ప్రధానమంత్రి పదవిని చేబడుతారా?" అని ప్రశ్నించారు అప్పుడు తిలక్ "నేనొక్కడినే మంత్రి పదవిని స్వీకరించుతే ప్రయోజనం ఏమిటి? అనేకమంది మంత్రులను, ప్రధానులను తయారుచేయగల ఉపాధ్యాయుడుగానే ఉంటాను భారతదేశాన్ని రక్షించే యువకులను తర్ఫీదు చేసే ఉపాధ్యాయ స్థానమే నాకు గొప్ప పదవి" అని సమాధానం చెబుతాడు కనుక అధ్యాపక వృత్తి ఏదో చిన్న ఉద్యోగమని 'బ్రతకలేక బడిపంతులు' అని ఎవరూ భావించ రాదు అది ఎంతో పవిత్రమైనది పూర్వజన్మ సుకృతం వలననే అది లభిస్తుంది. అందరికీ లభించదు కనుక అటువంటి పవిత్రమైన '**అధ్యాపక వృత్తి**' సార్థకం చేసుకోండి బాలబాలికలకు ఉత్తమ నైతిక విలువలను బోధించండి వారిని నిజమైన భావిభారత పౌరులుగా తీర్చిదిద్దండి

## డా॥ సర్వేపల్లి ఆదర్శం :

అధ్యాపకులను అవహేళన చేస్తున్న పరిస్థితులలో విద్యార్థుల ప్రేమాదరాభిమానములను చూరగొనిన ఒక మహావ్యక్తి, భక్తి శ్రద్ధలతో పూజింపబడిన ఒక మహోపాధ్యాయుడు, విద్యార్థుల హృదయాలపైన చెరగని ముద్రవేసిన ఒక '**ఆచార్యుడు**' ఉన్నాడంటే ఆశ్చర్యమే ఆ ఆచార్యుని బోధనాపటిమ, హాస్యచతురత, గుణగణాలు ఎంత గొప్పవై ఉండాలి? అతనే **డా॥ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు.** మైసూరు విశ్వవిద్యాలయంలో రెండు సంవత్సరాలు ఆచార్యునిగా పనిచేసి, కలకత్తా విశ్వవిద్యాలయంలో పనిచేయడానికి బయలుదేరి వెళ్ళుతున్న సమయం అది ఎందరో సహ అధ్యాపకులు, విద్యార్థులు వీడ్కోలు యివ్వడానికి ఆయన వసతి గృహానికి వచ్చారు సామాను సద్దారు. రైలు స్టేషన్‌కు వెళ్ళడానికి గుర్రపు బగ్గీని

తీసుకొనివచ్చారు సర్దిన సామాను అందులో పెట్టారు కొందరు విద్యార్థులు డా॥ సర్వేపల్లిని ఎత్తుకొని తీసుకొనివెళ్ళి బగ్గీలో కూర్చోపెట్టారు మరికొందరు విద్యార్థులు బయలుదేరుతున్న సమయంలో బగ్గీకి కట్టిన గుర్రాలను వదిలి వేసి, ఆ స్థానంలో విశ్వవిద్యాలయ విద్యార్థులు, కాడిని తమ మెడలపైన పెట్టుకొని, మైసూరు ప్రధాన పురవీధులగుండా, ఆ బగ్గీని స్టేషన్ వరకు లాక్కొని తీసుకొని వెళ్ళారు జ్ఞానాన్ని ప్రసాదించిన గురువుకు ఆ విధంగా కృతజ్ఞతలు చెప్పుకున్నారు ఆ విద్యార్థులు తమపట్ల విద్యార్థులు ప్రదర్శించిన భక్తికి, చూపిన గౌరవానికి డా॥ సర్వేపల్లి కళ్ళు చెమ్మగిల్లాయి పురవీధుల లోని ప్రజలు ఆశ్చర్యచకితులైనారు విశ్వవిద్యాలయ విద్యార్థులలో ఒక ఆచార్యుడు అంతటి స్థానాన్ని సంపాదించడం అసామాన్యమైన విషయం అది ఆయన ప్రతిభకు, ప్రజ్ఞకు నిదర్శనం నిస్వార్థంగా విద్యాసేవకు అంకితం కావటంవలననే, ఆయనకు దైవానుగ్రహం లభించి, ఆచార్య స్థానం నుండి రాష్ట్రపతి స్థాయికి ఎదగగలిగారు డా॥ సర్వేపల్లి అన్ని దానముల లోకి విద్యాదానం గొప్పది గదా! ఆదర్శ అధ్యాపకునిగా గౌరవించడాని కోసం, డా॥ సర్వేపల్లి జన్మదినము అయిన సెప్టెంబరు 5వ తేదీని Teachers Day గా జరుపు కోవాలని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది అదేరోజున దేశంలో పలు చోట్ల ఆదర్శ అధ్యాపకులను ఉచిత రీతిలో గౌరవించి, సన్మానించడం సత్సంప్రదాయంగా వస్తున్నది నేటి అధ్యాపకులు కూడా తమవంతు కర్తవ్యాన్ని బాధ్యతలను విద్యుక్త ధర్మంగా భావించి నిర్వర్తిస్తూ ఆదర్శ అధ్యాపకులుగా వెలుగొందుతారని ఆశిద్దాం. ఆదర్శ అధ్యాపకులే విద్యార్థులను ఆదర్శవంతమైన పౌరులుగా తీర్చిదిద్దగలుగుతారు.

## బ్రహ్మశ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడు :

విద్యార్థులకు విద్యను బోధించడంతోపాటు చమత్కారం, హాస్యం, సమయస్ఫూర్తి ఉన్నవారే అధ్యాపక వృత్తిలో రాణిస్తారు, శోభిస్తారు. వీటన్నింటినీ స్వంతం చేసుకున్నవారే బ్రహ్మశ్రీ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారు. ఆయన ఆంగ్ల భాషలో దిట్ట ఆయన బందరు నోబుల్

కళాశాలలో అధ్యాపకునిగా పనిచేశారు ఒకసారి క్లాస్ అయిపోయిన తరువాత నలభై కాంపోజిషన్ పుస్తకాలు తన చేతిలో పట్టుకొని వెళ్ళుతుండగా ఒక విద్యార్థి తెలిసో, తెలియకో ఎదురుగా వచ్చి "మాష్టారుగారు గాడిద బరువు మోస్తున్నారే!" అన్నాడు ఆయనకు కోపం రాలేదు సమయస్ఫూర్తితో, చమత్కారంగా వెంటనే "ఒక్క గాడిద బరువు కాదు నాయనా! నలభై గాడిదల బరువు మోస్తున్నాను" అని ప్రత్యుత్తరము ఇచ్చేటప్పటికి ఆ విద్యార్థి తలవంచుకున్నాడు ఆ నలభై పుస్తకాలలో, ఆ మాట అన్న విద్యార్థి కాంపోజిషన్ పుస్తకం కూడా ఉన్నదిట హాస్యం ఎంతటివారినైనా లోబర్చు కుంటుంది కోపంగల వారిని శాంతింపజేస్తుంది కనుక అధ్యాపకులు అప్పుడప్పుడు హాస్యమును కూడా ప్రదర్శిస్తుండాలి ఎల్లప్పుడూ 'సీరియస్'గా ఉండ కూడదు ఛలోక్తులు కూడా విసురుతూ ఉండాలి సమయస్ఫూర్తితో విద్యార్థుల హృదయాలను ఆకట్టుకొని, వారిని సన్మార్గమున పెట్టటానికి ప్రయత్నిస్తుండాలి. అధ్యాపక వృత్తి చాలా గౌరవమైనది, ఆదర్శవంతమైనది, బాధ్యతతో కూడుకొనినటువంటిది, విద్యార్థులను తీర్చిదిద్దటంలో ప్రధాన మైనది, చాలా కీలకమైనది విస్మరించకండి!

ఒక ప్రముఖ విద్యావేత్త, తన అనుభవంతో అధ్యాపకుల స్థాయిని, సామర్థ్యాన్ని నాలుగు వాక్యాలలో చక్కగా వివరించాడు

***A Poor teacher Tells***
***An Average teacher Explains***
***A Good teacher Demonstrates***
***A Great teacher Inspires***

అధ్యాపక వృత్తిలో చేరిన వెంటనే ఎవరూ ఉన్నత శిఖరాలను ఒకే పర్యాయం అందుకోలేరు ప్రయత్నం చేత ఎంతటి కార్యాలనైనా సాధించ వచ్చును. ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి ఎదగవచ్చును శ్రద్ధ, పట్టుదల, కృషి వుంటే ఉన్నత శిఖరాలనందుకోవచ్చును ఆదర్శ అధ్యాపకులుగా సమాజంచేత మెప్పును, ప్రశంసలను కూడా అందుకోవచ్చును అనుభవం

గల ఆదర్శ అధ్యాపకులు మాత్రమే విద్యార్థులను Inspire చేయగలరు ఈనాడు విద్యార్థులకు స్ఫూర్తిని యివ్వగల అధ్యాపకులు అత్యవసరం విద్యార్థి అనే నావకు అధ్యాపకుడు చుక్కాని వంటివాడు విద్యార్థులను తీర్చిదిద్ది, ఉత్తమ పౌరులుగా తయారుచేయగల శక్తి, సామర్థ్యం ఒక్క అధ్యాపకునిలోనే ఉంటుంది కనుక అటువంటి పవిత్రమైన, కీలకమైన అధ్యాపక వృత్తికి న్యాయం చేయండి! జీవితాలను సార్థకం చేసుకోండి! తరించండి!

# తల్లిదండ్రుల కర్తవ్యం

Home is the first school for children, parents are their first teachers పిల్లలకు ఇల్లు ప్రధమ పాఠశాల, తల్లిదండ్రులు వారికి ప్రధమ గురువులు అయితే ఈనాడు ఈ వాస్తవమును చాలా మంది తల్లిదండ్రులు విస్మరిస్తున్నారు అసలు సమస్య ఇక్కడ నుంచే ప్రారంభమవు తున్నది మన భారతదేశంలో అనాదిగా వస్తున్న 'ఇల్లు - ఇల్లాలు' వ్యవస్థ అవస్థలలో పడటం వలన బాలబాలికలలో క్రమశిక్షణా రాహిత్యం రోజురోజుకు పెచ్చుపెరిగిపోతున్నది పిల్లల యెడల తల్లులు చూపించ వలసినంత శ్రద్ధ చూపటంలేదు చిన్ననాటనే కాన్వెంట్స్‌కు, వసతి విద్యాలయాలకు పంపి, తమ బాధ్యత తీరిందని భావించటం వలన, వారికి తల్లిదండ్రుల మనస్తత్వం అబ్బకుండా, ఆయాలు, దాదుల మనస్తత్వమే అబ్బుతున్నది. ఇంటి వద్ద పిల్లల భౌతిక చదువుల విషయంలో కూడా తల్లిదండ్రులు ఏమాత్రం శ్రద్ధ వహించడంలేదు, వారి ప్రవర్తనను గురించి ఎవరూ పట్టించుకోవటం లేదు మంచి స్కూల్‌లో చేర్పించుతే పిల్లలకు ఒకవేళ లౌకిక చదువు వస్తే రావచ్చునేమో గాని, సత్ప్రవర్తన మాత్రం అబ్బదుగదా! ఇది వెల చెల్లించుతే లభ్యమయ్యే వస్తువు కాదు విద్యాలయాలలో కూడా ఈనాడు 'నీతిబోధ' జరగడం లేదు. ఇంటి వద్ద తల్లిదండ్రులు ఈ విషయంలో ఏ మాత్రం శ్రద్ధ తీసుకోవటంలేదు. ఇంకా

ఏ విధంగా పిల్లలు సచ్ఛీలసంపన్నులవుతారు? ఏ విధంగా విద్యావినయ శోభితులుగా వెలుగొందుతారు? నేటి విద్యాలయాల చదువులమీదనే ఆధారపడితే పిల్లలలో నైతిక ప్రవర్తన అభివృద్ధికాదు నీతిలేనివాడు ఎందుకూ పనికిరాడు వినయం అబ్బనివాడు రాణించడు సత్ప్రవర్తన లేనివాడిని సమాజం గౌరవించదు కేవలం భౌతిక విద్యలలో అత్యధిక శాతంలో ఉత్తీర్ణులైనప్పటికీ ప్రయోజనం ఉండదు ప్రయోజనం లేకపోగా అప్పుడప్పుడు అట్టివారి వలన ప్రమాదాలు కూడా సంభవిస్తుంటాయి కనుక లౌకిక విద్యలతోపాటు, బాలబాలికలలో నైతిక విలువలు పెంపొందించే ప్రయత్నం కూడా జరగాలి ఈ విషయంలో తల్లిదండ్రులు ఇంటివద్ద ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలి

తల్లులు దేశానికి వెన్నెముకలాంటివారు, హృదయం వంటివారు ప్రతి వ్యక్తికి మొట్టమొదటి గురువు మాతృదేవి అవతార పురుషులకు కూడా తల్లే గురువు మహర్షులు మహనీయులు, వీరులు, శూరులు తల్లి గర్భము నుండి ఆవిర్భవించినవారే గదా! కనుక వారికి మొట్టమొదట తల్లే గురువు, తల్లే దైవము తల్లి ఇంటికి, సంఘానికి, జాతికి మూలస్తంభం **"లౌకిక విద్యలు బోధించు ఉపాధ్యాయునికన్నను ఆచార్యుడు (కులగురువు) పదిరెట్లు శ్రేష్ఠుడు అట్టి ఆచార్యుని కన్ననూ కన్నతండ్రి నూరురెట్లు శ్రేష్ఠుడు. అట్టి కన్నతండ్రి కన్ననూ 'మాతృదేవి' వేయిరెట్లు పూజనీయురాలు"** అని మనువు చెప్పాడు

మన దేశంలో 'మాతృదేవి'కి అంతటి అగ్రస్థానం యివ్వబడింది భారతీయ సంస్కృతిలో తల్లికి పూజనీయమైన, పవిత్రమైన స్థానం యివ్వ బడింది. అందువలన ఈ పవిత్ర దేశమును **'మాతృభూమి'** (Mother land) అన్నారు తల్లి ఒడి ప్రధమ బడి జాతి గర్వించదగిన వీరులను, శూరులను, యోగులను, మహర్షులను, జ్ఞానులను, ఆధ్యాత్మిక తత్త్వ వేత్తలను, సంఘసంస్కర్తలను తీర్చిదిద్దిన ఘనత ఈ మాతృమూర్తులదే. ఒకసారి శ్రీ సత్యసాయిబాబావారు ఆదర్శ మాతృమూర్తుల గురించి చక్కటి పద్యం చెప్పారు.

"కౌసల్యా వరశుక్తి గర్భమౌటను కదా
రాముడు దేవుడై రమణ గాంచె
సీతామహాసాధ్వి చెలగి పెంచుట కదా
కవలు లవకుశులు ఘనులు అగుట
జిజియా లలామ చెలగి పెంచుట కదా
వీరశివాజియు పేరుగాంచె
పుతలీబాయి రంజిల్లి పెంచుట కదా
గాంధీ మహాత్ముడై ఘనతగాంచె
ఈశ్వరాంబా సాధ్వి ఎత్తి పెంచుట కదా
సత్యనారాయణునకు విశ్వఖ్యాతి కలిగె

ప్రాణికోటి యీ రీతి పరిమళించె
అహరహంబును బ్రోచెడి అమ్మకంటె
ఆదరంబగు వ్యక్తులు యీ అవని గలరె?
అమ్మ ప్రథమాక్షరంబు - ఆద్యక్షరంబు"

**'అమ్మ'** పదంలోనే ఉన్నది కమ్మదనం **'అమ్మ'** పేరులోనే ఉన్నది గొప్పతనం **'అమ్మ'** ఒడిలోనే ఉన్నది పవిత్రత 'అమ్మ' అమ్మే గాని **'మమ్మీ'!** కాదు

**'ఇల్లు చూచి, ఇల్లాలిని చూడు'** అనే సామెత ఒకటి పూర్వం ఉండేది అలనాటి ఇల్లు, ఒక పవిత్ర దేవాలయం. ఆ ఇంట్లో వుండే ఇల్లాలు ఒక 'మాతృదేవి' ఆ గృహంలో ఉండే ఇల్లాలు ఒక 'గృహలక్ష్మి'ఆనాటి ఇల్లు ఒక పవిత్ర గ్రంథాలయం. ఆనాడు ఆ ఇంట్లో వుండే ఇల్లాలు ఆధ్యాత్మిక, పురాణ, ఇతిహాస, చరిత్ర గాథలను, దేశభక్తి భావాలను, నైతిక విలువలను పాటల ద్వారా తమ పిల్లలకు వినిపించే ఒక 'ఉత్తమ అధ్యాపకురాలు' అయితే ఆనాటి ఆ పవిత్రమైన ఇల్లు ఈనాడు డిటెక్టివ్ సాహిత్యంతో,, సెక్స్ సాహిత్యంతో, క్షుద్ర సాహిత్యంతో నిండిపోతున్నది. ఆ ఇంట్లోనివారు

వాటిని చదివి ఆనందిస్తున్నారు, సంస్కారవిహీనులవు తున్నారు  ఇంకా ఆ పిల్లలు ఉత్తమ భావిభారత పౌరులుగా ఎలా రూపు దిద్దుకోగలరు? ఇదే ఈనాటి ఈ సమస్య ఇది మారాలి  తల్లిదండ్రుల భావాలు మారాలి, ప్రవర్తన మారాలి  అప్పుడే బాలబాలికలు మారుతారు  దేశభక్తిభావాలను, నైతిక విలువలను పెంపొందించుకోగలుగుతారు  ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దబడుతారు  అప్పుడే మన పెద్దలు ఆశించిన నవభారత నిర్మాణం జరుగుతుంది  ఆ పవిత్ర ఆశయ సాధనకు తల్లిదండ్రుల సహకారం ఎంతైనా అవసరం

# విద్యా సంస్థల పాత్ర

'నైతిక విద్యావ్యాప్తి' విషయంలో విద్యాసంస్థల పాత్ర అత్యంత గణనీయమైనది  విద్యాసంస్థలు ముందుకు వచ్చినప్పుడే ఈ పవిత్ర కార్యం విజయవంతమవుతుంది  విద్యాసంస్థల అధినేతలకు, ప్రధానోపాధ్యాయులకు, ప్రిన్సిపాల్స్‌కు ఒక చిన్న మనవి

1. **ప్రతి తరగతిలోను వారానికి ఒక నీతి తరగతి (Moral Class) ని క్రమం తప్పకుండా విధిగా నిర్వహించండి**

2 **ప్రతి జిల్లాలో సెలవులలో నిర్వహించబడేటటువంటి 'అధ్యాపక శిక్షణా శిబిరాల'కు ప్రతి విద్యాలయం నుండి కనీసం ఇద్దరు అధ్యాపకులను పంపి 'నైతిక విద్యావ్యాప్తి'కి తోడ్పడమని 'మనవి' చేస్తున్నాము.**

సహకరించండి! 'నైతిక విద్యవ్యాప్తి'ని సాధిద్దాం. బాలబాలికలను సచ్ఛీలసంపన్నులుగా తీర్చిదిద్దుదాం



# నూతన సంస్థ ఆవిర్భావం

విద్యా సంస్థలలో 'నైతిక విద్యా వ్యాప్తి' కొరకు ఒక నూతన సంస్థ ప్రారంభించబడింది ఇది దేనికీ అనుబంధం కాదు ఇది ఒక స్వయం ప్రతిపత్తిగల సంస్థ దీని కార్యక్రమాలలో అన్ని విద్యా సంస్థలూ పాల్గొని, నైతిక విద్యావ్యాప్తి కొరకు తమవంతు సహకారమును అందించాలని అభిలషిస్తున్నాం

ప్రారంభంలో, ప్రధానంగా ఈ క్రింది మూడు అంశాలను గురించి బాలబాలికలకు బోధించాలని సంకల్పించబడినది

1 నైతిక విలువల ప్రాముఖ్యతను, ఆవశ్యకతను బోధిస్తూ బాలబాలికలను సచ్ఛీలసంపన్నులుగా, విద్యావినయశోభితులుగా తీర్చిదిద్దటం

2 మానవతా విలువలను బోధిస్తూ, బాలబాలికలలో మానవత్వాన్ని పెంపొందించటం

3 కులమతాలకతీతంగా బాలబాలికలలో దేశభక్తి భావాలను బోధిస్తూ, వారిని ఉత్తమ భావిభారత పౌరులుగా తీర్చిదిద్దటం

ఈ పవిత్ర ఆశయాలను సాధించడానికి విద్యాసంస్థలు మరియు అధ్యాపకుల సహకారం ఎంతైనా అవసరం వచ్చే విద్యా సంవత్సరము నుండి అధ్యాపకులకు శిక్షణా తరగతులు నిర్వహించాలని సంకల్పించుకొనినాము ప్రతి విద్యాలయంలో వారానికొక నీతి తరగతి (Moral Class) ని నిర్వహించాలని ఆకాంక్షిస్తున్నాము ఈ పవిత్ర ఆశయ సాధనకు రాష్ట్ర ప్రభుత్వ తోడ్పాటు కూడా ఎంతైనా అవసరమని భావిస్తున్నాము కనుక నైతిక 'విద్యావ్యాప్తి' కి అందరి సహకారమును అర్థిస్తున్నాము

**"నైతిక విద్యావ్యాప్తి దేశప్రగతికి సోపానం"**